ఉత్సాహ॥ వరవరేణ్యుఁ గాంచి నవ్వి నాదుప్రతిన చెల్లదే
తొరగఁ గాన్క దెమ్ము లెమ్ము తోయజాక్షి నినుఁగనన్
గరము గోరియున్న దనఁగఁ గమలనేత్ర యప్పుడే
యరుగుదెంచి నట్టులాతఁ డదరిపడఁగ లేచెఁ దాన్. 210

ఉత్సాహ॥ అంత ముసలిబాపనమ్మ యడుగులకును మ్రొక్కి య
త్యంతహర్షమంత యంతయలర నేమియేమి యా
కాంత నెట్లు సమ్మతింపఁగా నొనర్చినావు నీ
జంతతనము గలుగ దహహ జగతి నంచు మెచ్చుచున్. 211

క॥ ఆరామకుఁ గంతపరి
ష్కారముఁ దక్షిణ మొసంగి సతి యేమి యనెగా
గూరిమి దెల్పుమని నృపుఁడు
సారెకు వేఁడఁ జిఱునవ్వు సంధిల్ల ముఱిగా. 212

గీ॥ ఆఁకె వాఁకొను వినుము లోకైకచరిత
వనితనోము ముగియు శుక్రవారమునకు
నాటిరాత్రిఁ గాళికి మ్రొక్కఁ నాతి వోవు
నీవు గోప్యముగ నటకు నేగుదెమ్ము. 213

మ॥ అనిధాత్రీసురకాంత పోయినను గోత్రాధీశుఁ డానాఁడు వై
శ్యనిరావించి ముకుందు కార్యమిడె నార్యుం డొందు వాక్రువ్వ కా
పనిఁ దాఁ జింత నహర్నిశల్ సలుపుచోఁ బంకేజపత్రాక్షి కా
ళిని గొల్వంజని యంమతేనిఁగని మో లీలాలతాంతాయుధా. 214

చ॥ నను విడనాడనంచు నిట నాయెమటన్ జగదంబ మ్రొక్కి వాఁ
కొనుమన ఖడ్గమున్ దిగిచి గొబ్బున నాతఁ డొకింత వ్రాలి మ్రొ
క్కిన నసిదూపి రాజతల క్రిందఁబడం దెగ వేసి రాజనం
దన యతి భక్తిఁ గాళికిఁ బ్రణామము సేసి సుఖించె నెంతయున్. 215

గీ॥ అంతఁ గాళి ప్రసన్నయై యంబుజాక్షి
ధృతికి భక్తికి మెచ్చితిఁ బతినిగూడి
పరమభోగంబు లనుభవింపంగఁగలవు
కవచఖడ్గంబులను బూని ఘనతఁ జనుము. 216

క॥ లలితాలత తావకపిత
కలగని నటులేచుఁ దనయు కటకమువా ర
ట్లలరుమరు నీమ మామకుఁ
గలుగును రాజ్యవిభవంబు కళ్యాణముగన్. 217.

క॥ అని వజ్రతనుత్రంబును
ఘనఖడ్గము నొసఁగఁ గాంత కౌతుక మెసఁగన్
జనపతి తురగముఁ బైకొని
చనెఁ గాశీపురముఁబట్టి సత్వరితగతిన్. 218

చ॥ చనిచని కాశికాపురిని జంద్రనిభాస్య ప్రవేశమై ప్రశం
తిని జలకంబులాడి పరదేవిఁ దలంచుచు నుండి వల్లభుం
గనుఁగొనఁగా రమాకరముఁ గాంచు నభీష్టతఁ బోవుచో భటా
ళిని నురుఖడ్గకార్ముక శిలీముఖము ల్ధరియించి రాఁగనెన్. 219

క॥ వీరప్రతాప భటులగు
వారు పురుషవేషమునను వచ్చువలంతిన్
దూరముననుండిరే కదు
వారసి కాళిప్రసాదముఁ డను భ్రమగొనుచున్. 220

ఉ॥ క్రూరత మీఁద వచ్చినను గోమలి ఖడ్గకళాప్రవీణతన్
వారిని వారి యాశ్వముల వారక నేలఁబడంగఁ జేసి యా
వారి నొకండు పాటినను వాసవయిం జన వాఁడు నమ్రుఁడై
కారుణికాగ్రగణ్య నను గావుము దీనుఁడ నంచు మ్రొక్కుచున్. 221

సీ॥ నేను వీరప్రతాపభూజానిభటుఁడ
హరిహారవిలాసనందను నరసి పట్టు
కొనఁగ మేము దేశములందుఁ గుమ్మరుచును
మిము నతనిగాఁగ భావించితిమి నృపాల. 222

గీ॥ అనవుఁడు హరిహర విలాస జనవరేందుఁ
డెచట నుండునో యచ్చోటు నీవు చూపి
తేని నినుఁ బ్రాణములతోడ నేను విడుతు
ననుచు వాఁడు ద్వారినిజూప నరిగె నతివ, 223

గీ॥ సచివమిత్రబాంధవసతీసహితుఁడగుచుఁ
జపము నతిసిద్ధ సలిపెడు తనదుమామ
నంతఁగని లలితాలత యధికభక్తి
వినతి యొనరింప నతఁడు దీవెనలొసంగి, 224

ఉ॥ రాజకుమార యేపురవరప్రభుసూనుఁడ వొంటిగా వనీ
రాజములం జరించుచును రాగతమెయ్యెడి దెల్పుమాయనన్
రాజసభాన్య సమ్మత పరాజిల రాజకులేంద్రుఁగాంచి యో
రాజిత తేజసత్ప్రబవరమ్మునఁగూల్చి స్వదీయరాజ్యమున్. 225

క॥ జగదభినుత్యంబుగ శ్రీ
జగదీశ్వరి కరుణఁ గూర్పఁ జనుదెంచితి నె
వ్వగ నీఁగి పురికి రమ్మా
నగ నన్ను జయించువారు ధర లేరు సుమీ. 226

క॥ అని నృపునందనోత్తముల నా
జననాథునిఁ బలుక నతఁడు శౌర్యోద్ధతుఁడై
తనవారితో రమాకర
మునకును విచ్చేయు జతనమున నున్నయెడన్. 227

గీ॥ ఆరమాకరపట్టణమందునుండి
పౌరు లొకకొంద ఱరుదెంచి పార్థివేంద్రు
నకు బహూకృతు లొసఁగుచు నతు లొనర్చి
యపరిమిత మోద భరితాత్ము లగుచు ననిరి. 228

గీ॥ స్వామి వీరప్రతాప భూజాని సుతుని
వీరఘంటామణీపురీవిభుని సూర్య
తేజు నొక సుందరీమణీతిలక మంచి
కాలయంబున ఖండించె నద్భుతముగ. 229

క॥ వీరప్రతాపుఁ డది విని
వారని వగ మృతినిజెందె వసుధాధీశా
మీరరుదెంచి ప్రభుత్వం
బారూఢతఁ జేయవలయు నని వేఁడి రొగిన్. 230

గీ॥ అంత నందఱతో హరిహరవిలాసుఁ
డాత్మనగరంబునకుఁ బోయి వ్యాసపార్ష్ణి
మను ప్రభుత్వంబు గైకొని మహి నుతింప
విభుత నెగడించె రఘువంశవిభుఁడనంగ. 231

క॥ హరిహరవిలాసుఁ డట సుతు
నరయఁగ నానాదిశలకు నాత్మభటాళిన్
గరమాదరించి యనిపెం
దరమా సుతువిడిచియుండ ధరణీశుఁడైనన్. 282

క॥ లలితాలత పురుషాకృతి
లలితాంబిక నెల్లపుడు దలంచుచు నట భూ
తలనేత చాల మనుజఁగఁ
నలరెం బతిగనుట యెపుడొ యను కోరికతోన్. 233

సీ॥ ఆశార్వరీపురి నారాత్రుసాంగన
లానాటి సాయంత్ర మందు లేచి
తమభర్తలఁ గనక తడఁబాటు నొందుచు
నిది యేమిచిత్రమో యెఱుఁగమనుచు
లలితాలత వసించు నెలవునఁ జని యామె
నాయమ పెనిమిటి నరయలేక
యుచ్ఛేదనముతోడ హర్మ్యంబు నంతయు
నింతుజాగ్రతఁ బూని వెదకి వెదకి
వరవిమానము లేమికి వగచి వగచి
యక్కటా లలితాలత టక్కుఁ బన్ని
యందఱను దోడుకొని పోయెనని తలంచి
యాయుబుసు నీఁగి చెలఁగి రిష్టాను సరణి. 234

ఉ॥ మారునకు నోడియంతట నమందరతేచ్ఛ నిశాటకామినుల్
నిరతతపంబులందగు మునిప్రకరంబు నహోముఖక్రియం
బరుషతఁ బట్టి పైకొనుచు మత్తతఁ గ్రిమ్మరుచో తృణ ప్రభా
కరుఁడను సుందరాంగుఁడు నికాముఁడు కాంతలు తన్నుఁబట్టినన్. 235

గీ॥ చరణతాడితభుజగరాజంబువోలె
నలిగి దండమునను వాంద్ర నలుగఁ గొట్టి
మాసమున నీల్గుచు రటించు మఱిశపించె
గాధిజుఁడు రంభఁ దిట్టినకరణిఁ దోఁప. 236

గీ॥ అంత నల్లద్రాగుడు ముండ లింతవంత
తాత్మసదనంబునకుఁ బోయి వ్యాసపార్ష్ణి
మాఖ్య సద్దివసంబిదె యరుగుదెంచె
వరతపము సేయు పితఁ గనవలయుననుచు. 237

కం॥ ప్రతివత్సర మేగునటుల
కుతుకమునఁ దపోవనమునకుం జని కట్టా
గతగర్వుఁడై పడియుండిన
పితఁ గనిరి నితాంతదుఃఖపీడితలగుచున్. 238

కం॥ ఘోర హయగ్రీవామర
వైరిం మ్రిఁడు రక్తబీజ వజ్రకవచర
క్రూరమణులు నీసరియే
శ్రైరికగిరిధైర్య సకలకర్బురవర్యా. 239

కం॥ అకటా మధుకైటభ సో
మక మాతంగ వృషభ వృక మహిషాసుర తా
రక ఘోరపద్మ దుర్గ క
నకకశ్యప ముఖులు నీఘనతఁ గాంతెఱి పితా. 240

గీ॥ కాలకేయులఁ ద్రిపురరాక్షసుల వృత్ర
బలి జలంధర దశముఖ బాణముఖులఁ
బోర నడఁచు నీశౌర్యంబు బ్రుంగె నకట
దైవకృత మాప నెవ్వారితరము ధరణి. 241

కం॥ అని వాపోయి తపోని
ష్ఠనున్న యాతనిఁ బురుషులు చంపుదురే భా
మిని యొకతనటికె నిక్కువ
మని యెంచుచు దీర్ఘదృష్టి సరసిరి నిజమున్. 242

కం॥ వలుగా కీ రాచబొట్టియ
లలితాలత త్రిగుబోతులంజె మన పితన్
దలఁ దఱిగి చంపి పోయెం
జలమున నాగుడిసె వాటిఁ జంపఁగవలయున్. 243

ఆ॥ మనల మోసపుచ్చి మనవిమానము మీఁదఁ
జనుట గాక యింత పని యొనర్చె.
రాచబిడ్డయనఁగరాదు దానిని జంపి
మనము దీఱ మనము దినఁగవలయు. 244

ఆ॥ చెనఁటిముండ రమాకరమనుపురమునఁ
బురుషవేషంబుఁబూని కాపురము సేయుఁ
గాన దాని కావర మాపి కసిమసంగి
యారగింపంగ నగునని యాత్మనెంచి: 245

క॥ పటువేగమున రమాకర
పుటభేదనమునకుఁ బోయి భూరిరవము ది
క్పటలి చెదరఁ జేసిరి తమ
కుటిలత్వపు మాయ మేటి కోటిగఁ గలంచన్. 246

ఉ॥ మాయలనెన్నియేని సగమంబు భయంబునఁ దత్తరింపఁగా
మాయురె వారు పన్నినను త్మావరుఁడేమి విచిత్ర మిద్ది దై
తేయుల చెయ్వులంచు నతిదీనతదోఁపఁగ నొంచు కార్యముం
జేయఁగఁ జాలకుండెఁ దన సెజ్జపయిం గనుమూసి మూర్ఛిచున్. 247

క॥ లలితాలత యయ్యదిగని
చలమున రాక్షసవనితలు చనుదెంచి రికన్
గలన మొనరించి వారల
తులవదనము మాన్పెదనని తోరపుటలుకన్. 248

క॥ చనుదెంచిన లలితాలతఁ
గని కౌతుక మినుమడింపఁగా దైత్యసతుల్
మినుకు లఱు తమకత్తులు
గొని పోరొనరించి నేలఁ గూలిరి యొకటన్. 249

కం॥ ఆవిక్రమంబు నరసి యి
లావిభుఁ డరుదెంది వేడ్క లలితాలతఁ దా
వేవే విధములఁ బొగడుచు
నావీటిని నుత్సవంబు నలరఁగఁ జేసెన్. 250

ఉ॥ ఆరజనీచరప్రమద లట్లు గతించిన నాఁడు రాజకం
ఠీరవుఁ డౌర లోకజననీకరుణాంగలనుండి లేచు నా
తీరున లేచియుండెన్ను గతించిన యెల్లరు నావితాన నిం
పూరఁ జెలంగి రా నగరమంతయు శోభిలె నాకమోయనన్. 251

కం॥ మునుపటిపోలిక రాజ్యము
ననుమగఁ బాలించుచును నిజాత్మజ నచటన్
గనలేక వందురి యతఁడు
దనకూఁతుఁ గనంగఁ గోరి తగఁ జాఁటించెన్. 252

గీ॥ రాజకంఠీరవుని చేత రాణమీఱి
శార్వరీపురి మరలఁ బ్రశస్తిఁ గనుట
తద్విభుఁడు పుత్రి నెమకుట దా విని యట
వచ్చె ఘటకర్ణనామ పాటచ్చరుండు. 253

కం॥ ఆతస్కరవరుఁ డాపురిఁ
జేతఃప్రమదమునఁ జేరి క్షితిపతిఁ గని పు
త్రీతిలకము చారిత్రముఁ
జేఁతులు జోడించుకొనుచుఁ జెప్పె విరివిగాన్. 254

గీ॥ అందునకు నద్భుతానంద మంది యాతఁ
డాత్మసతికిఁ గాంతిమతికి నదివచించి
నిఖలదేశంబులకు భటానీక మనిపెఁ
దన కుమారీమతల్లి వృత్తాంత మరయ. 255

గీ॥ తనదు ప్రేయసిఁ బాసి నితాంతచింతఁ
బురము పురము వెంబరవిత్తుఁబోలెఁ దిరిగి
ధూమపురిని గాళిప్రసాదుండు చేరె
నకట కాఁదారి మాఁదారి యదనునందు. 256

గీ॥ నడికిరేయిని మఱియొండు కడకుఁ జనఁగఁ
జాల కాతఁ డొండొక యింటి జగతిమీఁదఁ
దనదు శ్రమ యింత దీఱ ముదంబు మీఱ
విశ్రమించి యొంచుచునుండె విధికృతంబు. 257

క॥ అతఁడున్న యింటి యెదుటను
క్షితినాథు పురోహితుఁడు వసించు నతనికి
రతియనెడి భార్య గల దా
యతివ కులటలందు మిన్నయగుచుఁ జెలంగున్. 258

క॥ ఆపుటభేదన మేలెడు
పాపాంబుధిమంథరుండు పక్షాత్ముఁడు త
ద్రూపావతి నుంచుకొనియె
రూపాజీవలక్ష బ్రమకు క్రుంగుచునుండన్. 259

గీ॥ ప్రభుపురోహితుండు రామేశ్వరాహ్వయుఁ
డొకర్తె భోయముండ నుంచుకొనుచు
రేయి పగలు దాని గృహమందు నెలకొనెఁ
దనదుసతికి మోద మినుమడింప. 260

చ॥ అతిరమణీయరూపయగు నారతి భూపతి పంపు వస్తు సం
తతి గొనిదెచ్చు నౌకరులఁ దచ్చన లాడుచు సానివృత్తిగాఁ
జతురత యొంటియున్నయపుఁ జాఁకలివాఁడొకఁ డిష్టజారుఁడై
ప్రతినిశయందు వంటగదిపంచ రహస్యముగాఁ జరించఁగాన్. 261

గీ॥ అరుగుమీఁదఁ గాళిప్రసాదాఖ్యుఁడున్న
రాత్రి మధుపానమత్తుఁడై రజకుఁ డకట
రతిని వీదికిలాఁగి క్రూరతను గొట్టె
మేదినిని జారపతిపోటు మెండుగాదె. 262

క॥ రతియంత గంగుకానిని
బ్రతిమాలుచు నిట్టునట్టు పరికించుచు భూ
పతి సుతుఁ గని వీఁడిఁక నా
గతి వెలి నిడు నంచు వెంది కడుఁ దడఁబడుచోన్. 263

గీ॥ వేఁటకుం బోయియున్న యుర్వీశ్వరేంద్రుఁ
డపుడు రతిఁజూచు నభివాంఛ నచటరాగ
నతివ తడఁబాటునొంది ధైర్యంబుఁ బూని
నృపతి సత్కరించి వచించు వేడ్కతోడ. 264

చ॥ ధనదకుమారరూప నినుఁదక్క మతెవ్వరిఁ దాఁక నంచుఁ బూ
నిన వ్రతమూడిపోవ నొక నీచుఁడు నీ రిడు మంచు వచ్చి ర
మ్మని వినకున్న లాఁగినను నక్కటకొట్టుచు నుండ నీవు రాఁ
గని మొమరింటితి న్నెపయిఁ గ్రద్దులఁబాటి పరుండఁ జూడుమీ. 265

గీ॥ అనుచు మడివాలుగొట్టిన యట్టిదెబ్బ
లాడలినంతట దద్దులై యుంటఁజూపి
వామ్రబతుకేల నీవంటి నాథుఁడుండి
యిట్టి యిడుము లొందితినని యేడ్చె నింతి. 266

గీ॥ అంత నవనీంద్రుఁ డమితాగ్రహంబుఁ బూని
యారెకులఁ బిల్చి యా హరిహర విలాస
తనయు బంధింపఁగాఁ జేసి తరుణిఁ గ్రుచ్చి
కౌఁగిలించి యోదార్చి నగరునకుఁ జని. 267

కం॥ తెలతెల్ల వారునంతట
హాలధరుఁడను మంత్రిఁ బిలిచి యానిసి యుబుసున్
బలికి నతికింపుము మహా
ఖలునని యాజ్ఞయిడ నతఁడు కైమోడ్చియనున్. 268

కం॥ కరుణించి వినుము భూపా
తరుణులమాయ లరయంగఁ బరమా విధికిన్
బురుషులు మహాత్ములగుట
పరిపరిభంగులను మాయఁ బన్నుదు రతివల్. 269

గీ॥ తమకు నొక్కనిపై నిష్ట మమరునేని
వాని నింద్రుఁడు చంద్రుఁడుఁగా నుతింత్రు
తమకు మూడిన యంతఁ బంతంబుపట్టి
వానికిని హీనుఁగావింత్రు వనితలధిప. 270

గీ॥ మూలమాదిగలదికాని మానహీను
లనుచుఁగాని తలఁచరు దృఢాంగధనులఁ
గోర్కెలూరఁ గులీనలు గూడుచుంద్రు
ప్రాణహానికి నింతేని భయముపడక. 271

గీ॥ తాము పిలువంగరాని యుత్తమగుణాఢ్యు
వేరొకరుచూడఁ బిలుచు వివేకహీనుఁ
బరపురుషుఁ జేరునెడఁజూచు బాటసారి
నకట యల్లరిచేయుదు రసతు లధిప. 272

చ॥ జనవర పాంథుఁ డొక్కట నిశాసమయమ్మునఁ బ్రోలిఁ జేరి యుం
డను ద్విజకాంత యయ్యది గనుంగొని కొండొక జారుతోడఁ బ్ర
చ్ఛన లొనరించియుండు నని చాటునటంచుఁ గుయుక్తిఁ బన్ని వా
నిని దొంగటాల్పఁజూచు నిది సిగ్గవమంచుఁ దలంపఁగాఁ జనున్. 273

శా॥ అనవుడుఁ గోపగించుచు మదాజ్ఞను దాటక తత్క్షణంబె క్రూ
రుని నటికింపుమంచు నవరోధముఁ జేర నరేంద్రుఁ డేగ నా
వనితలపై విరాళిగొని వారక మ్రగ్గెడువారు కామినీ
జనముల నీచకృత్యములఁ జూఁటిన నష్ట రదేమి మాయహో. 274

గీ॥ అంత మంత్రి భటులఁ బిల్చి యడవియందు
వీరిఁ బోవిడిచి నృపాలుతో నటికితి
మని వచింపుఁడనఁగ వార లాయమాత్య
మాట జవదాట కటుచేసి రోటలేక. 275

గీ॥ వారు వనమున విడిచిపోవంగ ఖిన్నుఁ
లగుచుఁ గాళిప్రసాముఁ డాయడవియందెఁ
దిరిగితిరిగి యొండొకదారి నరిగి యరిగి
నందనగరముఁ జేరె నానందములర. 276

ఉ॥ అంగజసన్నిభాంగుఁ డటఁ డంటటఁ దన్నగరీతటాకథా
రాంగమునన్ శ్రమంబోగిఁ గురంగతురంగదయానుఖూతిఁ బో
వంగ వసించె వారిరుహ వారములన్ శఫరీకుళీర చ
క్రాంగములం గనుంగొనుచు రమ్యతరాంబువిలాస మెన్నుచున్. 277

గీ॥ ఆకు శేశయంబె యాపట్టణమునకు
సారవంతమగుట చానలెల్ల
నీరుగొనఁగ నటకు నిత్యమేగుచు నుంద్రు
ఘనఘటంబు లంకగొనుచు వేడ్క. 278

గీ॥ నంద నగరంబునేలు చంద్రముఖియనెడి
రాణికిని నర్మసఖియైన రాధికయను
ముఖ్యదాసిగా నడయాడు మోహనాంగి
జలముగైకొన వచ్చె నాసరసునకును. 279

సీ॥ ఆకర్ణదీర్ఘనయనయుగ మింతింత
యింద్రనీలమణులకీనుచుండ
లావణ్యలీలాజలమ్మునఁ గుచచక్ర
వాకము లుప్పొంగి పైకిదూఁక
వడఁకునడుము వీడిపడునని బిగియించి
నట్టి యొడ్డ్యాణ మంతంత వెలుఁగ
మొగలు పదరజస్సమానులనెమమాడిఁ
టింగుటంగుమని మట్టియలు మ్రోయ
బింబికాఫలచ్ఛాయావిడంబమాన
లాలితాధర రసమును గ్రోలుకొనుమఁ
జెలువతోఁ గేరడములాడి పలికినగుచు
దేహజునిఘోటి గున వచ్చె మోహనాంగి. 280

గీ॥ మోహనాంగి యట్లేతెంచి మోహనాంగు
నృపసుతుని గాంచి తమిగొని నీరుగొనుచు
నగరికిని బోయి పాంథుని సొగసు రాధి
కకును విన్నవించెను వరాంగము చెమర్ప. 281

ఉ॥ దిచ్చరిమేలుబంతియన దింటిమలాడుచు నూలునీతులన్
దొచ్చెపుముండ లూఁకొనఁగ దూఁకఁగఁ జేయుచు అంకురాశికి
నిచ్చలు మేలుకాంద్రగమి నేర్పునఁ గూర్చెదు రాధికాఖ్య మే
లెచ్చఁగ మోహనాంగి నుడు లెంతయుఁ దావిని తొట్రుపాటులోన్.

చ॥ చని విరిసెజ్జపైఁ బొరలు చంద్రముఖింగని యానువార్త వాఁ
కొని సెలవంది పాంథుఁ దగఁ గోటకువచ్చు వితానఁ జేసి యా
తనికిని గావిబట్టలు ముదంబునఁ గట్టుకొనంగనిచ్చి స
న్మని తనుదెంచెనంచుఁ బురి బ్రోయఁగఁ జేసెఁ బ్రజల్బ మింపఁగాన్.

క॥ లలితాలత దలఁపునఁదగ
నీలాద్రినేతసుతుఁ డందు నింత వసించెన్
బలువిరముల గాసినిబడి
నలిగిన తనమేయి యలఁత యణఁగునటంచున్. 284

తరల॥ వలపు దూఁకొఁగఁదాళఁ జాలక వట్టి కోరిక లూరఁగన్
గులుకుగుబ్బలమీఁది పైఁటను గోటుగా దిగజార్చుచుం
జెటికినవ్వుచు వింతమాటలు సిగ్గు నీఁగి వచించుచున్
ఫలములం గొనితెచ్చి యిచ్చుచుఁ బైఁబడన్ గమకించుచున్. 285

ఉత్సాహ॥ కులుకులాడి మోహనాంగి గ్రోవతనము రేఁచఁగా
బలిమి నట్టె కౌఁగిలింపఁ బార్థివాత్మజుండు ధీ
తొలఁగుమంచుఁ గ్రిందఁ బడఁగఁ ద్రోసి తిట్టె నల్లవో
కులవధూటిఁ దక్కఁ దను నె గుణవిభాసితుం డిలన్. 286

క॥ ఆసార్వభౌమతనయుం
డాసరణి దయావిహీనుఁడై తనుద్రోయన్
హ్రీసన్నశిరోధియగుచు
నీసున వెస మోహనాంగి యిక్కకు నేగెన్. 287

ఉత్సాహ॥ దాఁగియుండి యద్దిగనిన దాసి యొర్త ధూర్తయై
వేగ పోయి రాధికకును వేడ్క మోహనాంగి నా
యొగిపెట్టినట్టి పాటు నుగ్గడింప నగుచు నా
బాఁగ చంద్రముఖికి నా తెఱంగు విన్నవించెఁ దాన్. 288

క॥ ఆరాణి యామాటలు విని
మారాకారుండు నాదు మాట గొనఁడొకో
యారా మన మొకటివలఁచ
వేరొకటి యాయె ననుచు వెలవెలఁ బాఱెన్. 289

ఉత్సాహ॥ ప్రతిదినంబుపోలె నాటిరాత్రి మధువుఁ ద్రాగి రా
యతివ తప్పటడుగు లిడుచు యతియనంగనున్న భూ
పతిని రాజు డాసి కదియఁ బట్టి కౌఁగిలించె నా
యతనుఁడలుకఁ బూవుటలుగు లదిమి యదిమి చొనుపఁగాన్. 290

క॥ కపటయతి రాణి యాఁగతి
నుపగూహన మాచరింప నుల్లం బెరియన్
జపలాత్మ పొమ్ము పొమ్మిటు
లెపు డొనరింపకుమటంచు నిలఁ ద్రోసెన్. 291

ఉత్సాహ॥ భూపసుతుఁడు మెట్టఁ ద్రొంగుబోతు జంకుమొండ బ
లోపమూని చింతబరికెఁ గొట్టికొట్టి మార సం
తాపమారఁ దనను భటులఁ దగిలి నిద్రపోయినం
దాపికత్తె రాధిక తనుఁ దగలఁ జితఁ డబఁచుఁ దాన్. 292

ఉత్సాహ॥ చిన్ననాటితనమునందు సిద్ధుఁ డొకఁడు దనకు మే
లెన్ని నేర్పినట్టి మంత్రమెంతయును జపింపఁగా
మన్నెపట్టి యాత్మఁ బెను మంత్రమహిమఁ జిలుకయై
విన్ను దెన్నుఁ బట్టి పాఱె విధికృతంబు పాయునే. 293

గీ॥ రాజనందనుఁ డాగతి రామతన్వి
రూపుగొని పాటి పాటి గౌరీపురంబు
నందు ఫలనతారామమధ్యమున వ్రాలి
నడబెడంగుచునుండె మై బెడఁగు లడర. 294

క॥ గౌరీపురిని ధనాఢ్యా
గారుండు విభుండు రత్నపాలాహ్వయుఁ డే
పారు జగన్మోహిని యను
వార స్త్రీరత్నమునకు వశుఁడై యకటా. 295

తరల॥ ఇనులు ఛీకొనఁ ద్యాగభోగము లెట్టివో కన కూనికం
దనము పెద్దలు గూర్చిపెట్టిన ద్రవ్యమంతయు సానికిం
దనివి దీఱ నతం డొసంగుచు ధర్మపత్నిఁ బతివ్రతం
గనులపండువుగాఁగఁ జూడక కావరమ్మునఁ ద్రిమ్మరుగా. 296

క॥ కులదూషణుఁడగు వైశ్యుని
కులసతి మణిమాలికాఖ్య కుందుచుఁ జెలితో
నెలదోఁటనుండి హరిహర
విలాసజుఁడు శుకముగాఁగ విహరింపంగన్. 297

చ॥ కని యిది కొత్తచిల్క మును గాన మహో రె శుకంబులంగనుం
గొన మొకొ యింత ఢాల్గలిగి గోటును జూపెనె యెట్టులేని దీ
నిని గయిఁబట్టుకొందమనని నేర్పలరారఁగఁ బొంచిపొంచి పై
కొని చెఱఁగేసిపట్టుకొని గొబ్బున నొండొకపంజరమ్మునన్. 198

తే॥ పదిలపఱిచి తియ్యని మంచిపండ్లనెల్లఁ
దనివి పడఁగ నొసంగుచు దాని నెలమిఁ
దనదుబిడ్డగా భావించి పెనుపసాఁగె
మగనిపైనున్న వెసనము మఱఁగిపోవ. 299

తే॥ ఆపురము నేలు వృకకేతుభూపు సుతుఁడు
దండకసముఁడు కాలమేఘుండు రత్న
పాలుసతి మణిమాలికఁ బడయఁగోరి
మంత్రసానినోర్తనిపె మగువకడకు. 300

క॥ ఆతార్పుకర్త్రియ వణి
జ్జేతబసకు నేగి యింటిని గనుంగొని యా
యాతగునీతులను బలికి
భూపాలపతితనయు కోర్కెఁ బొలుపుగఁ దెలిపెన్. 301

క॥ అటువాఁగొని యమ్మా రేఁ
పటిదినమునకు వరుదెంతు బదులీఁదగుహ్పా
త్పుటమున నిడుఁకొనుమని తన
కుటీరమునకుం గిరాతి కుతుకమునఁ జనన్. 302

ఉత్సాహ॥ హా యదెంత పలచనైతి నస్మదీయ పతి ననుం
బాయుటెంతవచ్చె తేసిపట్టి వజ్రశుంతుఁడే
చాయ నేసతిత్వ ముడుగఁ జాలుదాన ననుచు డో
లాయమానమానసాబ్జ యగుచునబల యుండుచోఁ. 303

గీ॥ తాపికత్రియవిచ్చేసి తగవినుచుట
వినుచునుండిన కీరము మనుజమధుర
వాక్యలను మణిమాలిక వంకఁజూచి
యల్లనల్లన నిటులాడె నామె వినఁగ. 304

క॥ అమ్మా మొగమ్ము వాడఁగ
నిమ్మాడ్కి నొగలవేల గృహిణికి గుణమే
సొమ్మనుచుఁ బురాణమ్ములు
కమ్మగఁ జాటుఁగద యోర్పు గైకొని విన్నమా. 305

క॥ పాతివ్రత్యం బందిన
నాతికిఁ ద్రిమూర్తులే మనంబసియాడన్
భీతిల్లుచు నుండుదు రన
లాఁతిని బలుకంగనేల లావణ్యనిధీ. 306

క॥ జనుషాంధుఁడైన వార్ధక
మునమునిఁగినఁ బంగుఁడైన మూర్ఖుండైనన్
ఘనరోగార్తుండైనను
దనపతి నతిభక్తిఁ గొలువఁ దగుసతికి సతీ. 307

క॥ కలకంఠకంఠి వినుమా
కలదొక పావనతరమగు కథ యది యిపుడే
బలికెద సరస్వతీతట
మలరారుం గొరి కాంక్షు లానందింపన్. 308

గీ॥ కర్దమాత్మజ యనసూయ కడిఁదిభక్తిఁ
దనుభజించుచునుండ ఛాత్రతతితోడ
నత్రిముని యా నదీతీరమందు నాశ్ర
మంబుఁ గల్పించుకొని యుండు మంజువాణి. 309

క॥ ఆమునినాథుని యాశ్రమ
భూమికిదవు దవ్వుగనొక పుర మలరు నటన్
శ్రీమంతుఁడు మకరధ్వజ
నామశ్రోత్రియుఁడు గలఁడు నళినదళాక్షీ. 310

క॥ అతనికి సుమతియనంగా
సుత యొండొకరితజనించె సుగుణాభరణన్
నుతియింప నెవరిశక్యము
సతులిల నాయమవిధానఁ జరియింపఁ దగున్. 311

క॥ మకరధ్వజుఁ డంతఁ గుమా
రిక నిర్మలచరిత సుమతిఁ బ్రియమారఁగఁ గై
శిక సుతుఁడగు శశికరునకు
సకల వ్రతు లభినుతింప సల్లగ్నమునన్. 312

గీ॥ పరిణయం బాచరించి దంపతుల నాత్మ
సదనమున నుండఁగాఁజేసి సంపదలను
వారికైవశంబుగఁజేర్చి వసికిఁజనియెఁ
దపము సేసెను నభివాంఛితం బెసంగ 313

క॥ తనమామ చనిన యంతట
వనితా తిలకంబుఁ గూడి వైభవయుతుఁడై
తనరుచు నుండె శశికరుఁడు
ఘనులందఱు దనుఁగనుఁగొని కైవారమిడన్. 314

క॥ దంపతుల రూపరేఖలు
సొంపార విటీవిటు లటఁ జూచి విరాళిన్
అంపెత్తి వారిఁగలఁచు త
లంపుగొనిరి దోషమునక లలనాతిలకా. 315

గీ॥ అంత నొక కొందఱు మరాత్ము లితనిఁ జేరి
చనువుచేసి దేవళమున సానియాట
నేడు బహువిచిత్రంబుగా నెగడు ననుచు
వాశకల్పించి తోడ్కొని యరిగి రటకు. 316

గీ॥ వేదశాస్త్రములఁ బఠించు విప్రవర్యుఁ
డాతఁ డాటచేడియఁ జూచి యధికమోహ
పరవశుండై కటా దాని బసకు నేగె
దుష్టమైత్రి వృథాయౌనె దోషమిడక. 317

గీ॥ శశికరుం డంత ఘనమోహ జలధి మునిఁగి
సానియిల్లె గతిగనుండి సకల సంప
దలను నటికి సమర్పించి తనువృథగ్వ
ముడిగి సుమతికిఁ దెలుప కాయూరు వదలె. 318

గీ॥ దుష్టజనముల మాయలఁ దూలిపడక
ధవుని నతిభక్తితో నెప్డు దలఁచు సుమతి
తనదువరి పట్నమును బాసి చనుట యెఱిఁగి
తత్క్షణం బాతఁ డరిగినదారిఁ బట్టె. 319

క॥ చనిచని నిజనాథునిగని
వినయోక్తుల నతని దేర్చి విధికృతమునకున్
వనరంగ నేల కలుములు
జనకోటికి నింతయేని శాశ్వత మగునే. 320

క॥ అని నానావిధముల బో
ధనచేయు సతిసుగుణంబుఁ దలఁచుచు నెంతేఁ
దనచెయ్వుల నిందించుచుఁ
జనిచని పద్మపురిఁ గాంచె శశికరుఁ డలఁతన్. 321

క॥ ఆపురమున నొక గుడిసెను
గాపుర మొనరించె నతఁడు కాంతారత్నం
బోపికతో బిచ్చసలిపి
సాపదువస్తువులు దెచ్చి పసఘూర్పంగన్. 322

గీ॥ సర్వవల్లభాసంభోగ జనితరోగ
మున వడఁకుపతి నారోగ్యవంతుఁ జేయ
వెదకి వెదకి దోషజ్ఞుల వేఁడి వేఁడి
మందులను దెచ్చుఁ గడక నామహితచరిత. 323

క॥ ఆరీతిని భిక్షాటన
మారూఢతఁ జేసిచేసి యాత్మీయవిభున్
గారాబమ్మున మనుచు స
తీరత్నము దాప మద్వితీయంబగుచున్. 324

చ॥ కనుఁగొని తత్పతీశునకుఁ గాంతలఁ గూర్చుచునుండు పూక్రమం
దనునొక డింగరీఁ డతివ యొండకువచ్చి నృపాలుకీర్తి వాఁ
కొని తనవృత్తిఁ దెల్ప సతి కోపమడంచి మృదూక్తి వాడునో
యనఘచరిత్ర నీహృదయ మారసితిం దగదట్టు లెన్నఁగాన్. 325

శా॥ క్రిఁక నొకపారి నాకటకు నీవరు డెంచిన నిన్ను నుర్విసా
యతకు శపింతుఁ బొమ్మనె భయంబున పోఁడు మఱొందు పల్కె ప
ల్కెక నృపుఁ జేరఁ బోయి ద్విజకాంతనుడు త్రెలుపంగ రాజు మా
ద్రకుపయిఁ గోపగించుకొని ధర్మచరిత్రకు సంతుభక్తితోన్. 326

క॥ ప్రతిదిన మాయావస్తువు
లతివలచే నంపఁగ సతి యతిమోహమునన్
పతిపతి దీవించుచుఁ దన
పతికిని దేహం బొకింత జాగుపటి చెఁదాన్. 327

మ॥ హరిసేనాంకుఁడు తత్పురీశుఁ డొకనాఁ డావీటిరావీథి రో
గరితన్ సుందరి సౌధ జేయి నది వేడ్కం జూడఁగా భార్యతో
ధరణీదేవుఁడు పోయి తాగ్రసాగసుం దాఁ గాంచి కామాంధుఁడై
మరలెం గొంపకుఁ గాముకుల్ దమకొదన్ మజ్జారె భావింతురే. 328

గీ॥ శశిధరుండు గోలోమికిఁ జాలఁజిక్కి
బనకు సతితోడ నేతెంచి వెసనపడుచు
బిడురపోవక బోనము వదలియుండె
సాధ్వి సుమతి యత్యంత విచార మొందెఁ. 329

ఉ॥ అంగన యంత భర్త హృదయంబు నెఱింగి మరీనఁ బోయి శృం
గాంగన మందిరంబుఁ జేర నానటి యామెకుఁ బూర్ణభక్తి సా
ష్టాంగ నమస్కృతు ల్సలిపి యస్మదగారముఁ బావనంబుఁ జే
యంగరుణించి నా రనుచు నల్లన నమ్రతదోఁచఁ బల్కినన్. 330

ఉత్సా॥ సుమతియంత సంతసమున స్వంగరాంగిఁ జూచి యో
కమలపత్రనేత్ర యొందు కార్య మొంది వచ్చితిన్
ప్రమదమారఁ దీర్ప నీదు భారమంచుఁ బల్కుచున్
రమణువాంఛ మెల్లగాను రమణికిని వచించెఁ దాన్. 331

క॥ పరవనితలఁ గూడుట యతి
దురితావహ మన్యసతుల తొడరుటఁ గాదే
హరుఁడు వరాంగచ్యుతుఁడై
పరిపరిగతుల నవమానపడె నృపతిలకా. 356

క॥ వరవర్ణినియైన జలం
ధరుసతి బృంద నెనసి హరి నానాకృతులన్
ధరణీస్థలిఁ గష్టపడియె
నరులను వనచరులఁ గూడి నరనాథమణీ. 357

క॥ సరసీరుహ సంభూతుఁడు
ధరాధరతనూజఁ గాంచి తమిఁగొనుటగదా
శిర మొకటి గోలుపోయెను
సురలెల్లరు భీయనంగ క్షోణీశసుతా. 358

క॥ సురలోకేశుఁడు గౌతమ
తరుణీమణిఁ గలసి కాదె తనదేహమునన్
దరుణులు రోయఁగఁ బాసెం
బరభామిని పొందుపొందె పార్థివతిలకా. 359

క॥ శీతమయూఖుఁడు గీష్పతి
నాతిని బైకొనుటఁ గాదె నయమున కళలన్
గోతిని బాసి చరించుట
భూతలపతితనయ సతులపొందు విడుపుమిఁకన్. 360

క॥ భూకాంతసుతా భృగుముని
లోకేశుసుత నరుచరిత లోలాత్ముఁడై
హా కాదనక బలాత్కృతిఁ
బైకొని యిక్ష్వాకుసుతుఁడు భస్మముగాఁడే. 361

క॥ వేదవరుని పుత్త్రికయగు
వేదవతిని రావణుండు వేధించి కటా
సోదర బంధు యుతంబుగ
మేదినిఁ గూలుటయు వినవె మితవాగ్భూషా. 362

క॥ పతిఁబాసి ఘోరవనమున
నతిచింతనుద్రిమ్మరు దమయంతిని జెనకన్
మతిఁగోరి శబరుఁడు చనఁడె
హితవాక్కు లొకింత వినుమ నృపవరతనయా. 363

క॥ సైంధవుఁడు కటకటా మో
హాంధుండై కృష్ణ నీడ్చి యాపద గనఁడే
గంధవహసూను చేతను
బంధురగుణ భూషితాంగ పలుకులు మనుమా. 364

శా॥ ధీరాగ్రేసరరత్నపాలుసతి పాతివ్రత్య మగ్గింపఁగా
నారంజోలికి శక్యమే రమణి మాహాత్మ్యం బమేయంబు హా
కారుణ్యాత్మక కాన శాప మిడకా కాంతాలలామంబు చిం
తారత్నాకరమందు గ్రుంగెదు మహాదైన్యంబు రెట్టింపఁగాన్. 365

క॥ లలనామణి శాపం బిడఁ
దలఁచునొకో యనుచు జడిసి తడఁబడితిఁ గటా
కులసతుల జోలి యేలా
వెలవెలఁదులు లేరె నీకు విమలగుణాఢ్యా. 366

ఉత్సాహ॥ అనుచు మంత్రసాని సీతు లతికయిల్లుఁ దనకుఁ దాఁ
జనువుఁబట్టి యాశినంత జనవరాత్మజుండు నె
మ్మనమునందు సంకటంబు మార్కొనంగ దిమ్మవై
కొనినయట్టు లట్టె యుండె కొంతసేపటికి నాగిన్. 367

కవిరాజవి॥ అతులితభక్తి జనింప నిజాలయమందు నహర్నిశలాడి ముదం
బతుకఁగఁ జేసె నటీతిలకంబని యబ్జధరుండు దయామతి రో
యాతివకు స్వప్నమునం బొడసూపి యహో కులవృత్తికి హానిగదా
యతనుఁడు సిద్ధనుఁ డాతని నీఁగుము యత్నునిచే సిరులందు మొగిన్.

క॥ కులవృత్తి విడువఁ దగునే
కలుములు గడుఁ గాంతువేని గలదురితంబుల్
దొలఁగును గైవల్యసుఖము
గలుగును గామాంధవైనఁ గలుషము లొదవున్. 381

క॥ కలనట్లు కరుణ శంభుఁడు
పలికె యదృశ్యుండు గాఁగఁ బదరుచు వేశ్యా
తిలకము నేలొక్కని మారుని
దొలఁగించి కుబేరుఁ జేరెఁ దోయజనయనా. 382

క॥ అలకేశుఁ డొసఁగిన సిరుల
జలజానన దానధర్మ సత్కర్మములన్
బలువిధములఁ జేసి భళీ
కలుషమ్ములు నీఁగి కనియెఁ గైవల్యంబున్. 383

క॥ ఒక్కనిపై మరులుగొనిన
యక్కలికికిఁ జెలిపిపుట్ట వాడఁగఁ దరమా
ముక్కంటికైనఁ జెలీ
చక్కనిదానవు వివేకసంపన్న వహో. 384

క॥ వెలచెలి మరులుగొనఁ దగదు
వలచిన యటుమాయఁ బన్ని వసువు గొనఁ జనున్
వెలజవ్వన ముడిగిన హా
కలుములు లభియించుటరుదు కమలదళాక్షీ. 385

గీ॥ తనదు సంపద లెల్లయుఁ దఱగెఁగాదె
రత్నపాలుని విడువంగరాదె కొమ్మ
యతనికంటెను వసుదేవుఁ డధికుఁడగుట
ద్రవిణ మెంతేని యొసఁగఁడే తమక నొసఁగ 386

క॥ ఆహా సుకాంత నూతన
మోహంబున నీకు నధికముద మలర జగ
న్మోహిని విశేషధన మిడు
నాహితవచనములు మనిచి నయమును గనుమీ. 387

భుజంగప్రయాతము॥ వ్యధూక్తిన్ శుకం బట్లు మేలైననీతుల్
మదిం గ్రిచ్చనట్లాడ మజ్జారె కీరం
బిడెంతాడె నానంచు నెంతేని మోసం
బెద న్మాటలంగా వేశ్య యింపారుపంక్తిన్. 388

గీ॥ రామతన్మకు నొసఁగి యారత్నపాలుఁ
దత్క్షణం బింటినుండి పోఁదఱుమఁ దలఁచి
తనమతల్లిని బురికొల్పఁ దగువులాడి
వైశ్యుఁ జీవాట్లుపెట్టి యిల్వెడలఁజేసె. 389

పంచచామరము॥ కటాకటా యిదెంత మోసకత్తెగా నటించెరా
నటిం బతివ్రతాలలామ వాఁగ నమ్మి యుండితిన్
విటత్వ మాదరింపనౌనె విత్త మంతమయ్యె మై
పటుత్వ మూడె గౌరవంబు పాసె నంచు ఖిన్నుఁడై. 390

క॥ కోమటిబసకుంజని ధా
ర్యామణి మణిమాలికకును హర్షం బిడుచున్
గామిని నుడిజవదాటక
కామకులం జేరకుండె ఘను లౌ ననఁ గాన్. 391

క॥ హరిహర విలాసుఁ డంతట
హరిసదనముఁ జేరఁబోయి యతులితభక్తిన్
గరయుగళము ముకుళించుచు
హరిపదముల దృష్టి నిలిపి యగ్గించునొగిన్. ౩౯౮

క॥ విధికిని దుఃఖం బొసఁగిన
మధుకైటభ నామకులగు మాంసాశనులన్
వధియించిన బాహాబల
యధికదయాలోల నన్ను నరయుము కరుణన్. ౩౯౯

క॥ ఏవీవరంబున హయ
గ్రీవాసురుఁడు మదముగొని త్రిమ్మరఁగ హయ
గ్రీవాకారమున ర
క్షోవీరుని దున్మినట్టి శూరవతంసా. 400

క॥ వేదచతుష్కము దొంగిలి
యాదోనిధిఁ జొచ్చినట్టి యాసోమకు బ్ర
హ్మాదులు వొగడ ఝషాకృతి
మోది శ్రుతులను మనుతవె యమోఘచరిత్రా. 401

పంచచామరము॥ సురాసురుల్సుధాభిలాష గూరతిన్ సుధాబ్ధిన్
దిరంబుగాఁగఁ జిల్కు వేళ ధీగమున్ దృఢంబుగా
ధరించినట్టి నిన్నువెన్న ధాతకుం దరంబె యో
పరోపకార కూర్మరూప భక్తలోకరక్షకా. 402

పంచచామరము॥ ధరిత్రిఁ జాపగాఁగఁజుట్టి దాఁగఁబోయినట్టి యా
హిరణ్యలోచనాసురేంద్రు నిద్ధశౌర్య మొప్పఁగా
వరాహఘోర రూప మొంది వ్రచ్చి ధాత్రి నేలవే
సురాభియాతిఘస్మరా విశుద్ధసద్గుణాకరా. 403

క॥ తనభక్తుని బ్రహ్లాదుని
దనయుండనియైనఁ గన కుదగ్రత హింసిం
చిన క్రూరుఁ గనకకశ్యపుఁ
దునుమవె నరసింహుఁ డనఁగఁ దోయజనాభా. 404

క॥ పౌలోమీశుని సంపద
వాలిశుఁడై కొనిన బలిని పాతాళమునన్
జాలిఁబడి యుండ నదిమిన
లీలావటుని నిను నేంతు లేఖస్తుత్యా. 405

గీ॥ తనమ తండ్రిఁ గూలిచి గోవు గొనుచుఁ జనిన
హైహయాధీశు వధియించినట్టి శూరుఁ
బరశురాముని గాంగేయ గురుని ఘనుని
నిన్నుఁ బ్రస్తుతిచేయుదు నిర్మలాత్మ. 406

గీ॥ అఖిలలోకకంటకులైన యసురవరుల
దశవదనకుంభకర్ణుల దర్ప మడఁచి
నట్టి యేకపత్నీవ్రతు నమలచరితు
మైధిలీలోలు నిను సదా మదిభజింతుఁ 407

క॥ సాంబుఁ గురువిభుఁడు నొంపఁగఁ
బంబుకినుక హలముఁ జొనిపి భాగీరథి నా
స్త్రంజేరమపురిఁ ద్రోయుట
కుంబూనిన నిను భజింతుఁ గ్రూరధ్వంసీ. 408

క॥ పాషండ మతస్థులచే
దూషితమయ్యె జగమంచుఁ దోఁచి ధరిత్రి
దోషముఁ బాపిన సుందరు
దోషజ్ఞుని నిను భజింతు దుఃఖవినాశా. 409

కపి॥ ఖలసముదాయము ఖారము నోపక గాసినిజెందెడు భూసతికిన్
బొలుపుగ మోద మొసంగెడు కోరికఁబుట్టి మహోదరితాత్ములొగిం
బొలిసెడు మార్గమొనర్చిన దేవకిపుత్రుని కృష్ణుని నిన్ను సదా
గొలిచెద మామకమోక్షముదీర్పుము కోవిదవంద్య మురారిహరీ. 410

మాలిని॥ శ్రీకరమా విరజానదియందు విరించనపూజలు గైకొని యి
క్ష్వాకునిచే సరయూవిమలావని వైభవమొందికవేరతనూ
జాకమనీయతటంబునఁ గాంతిలు సర్వమయాత్ముని రంగపతిన్
లోకవిభు న్నినునెంతు రమేశ త్రిలోచనమిత్ర దయానిలయా. 411

కం॥ మునివరయుగళమును విరిం
చిని స్వాహాపతిని రాజశేఖరనృపతిన్
గనికరమునఁ జంపకకా
ననమున మనిచిన దయావనధి నను మనుమా, 412

కం॥ కసిగొని వజ్రకవచ రా
క్షసవరుఁ గసిమసఁగి బదరికాక్షేత్రమునన్
బసగొనిన నిన్ను నెంచెద
వ్యసనమ్ము నడంపుమీ భవానీశహితా. 418

కం॥ కులశేఖర భూపాలక
తిలకుని భక్తు మలయాళదేశం బలరన్
లలితగతి మనిచిన దయా
నిలయుని శ్రీపద్మనాభు నిను సేవింతున్. 414

కం॥ దుష్టుల శిక్షించుటకును
శిష్టుల రక్షించుకొఱకు క్షితిఁ గలుగు బ
లకష్టముల నివారింపఁగ
ప్రస్తుత్యప్రవణీయచరిత వరియింతు విలన్. 415

క॥ అని నానావిధముల శ్రీ
వనమాలిని నుతు లొనర్చి వసుధేశుఁడు శం
భుని సదనమునకుఁ జని భ
ర్గునకును సైమోడ్చి యను నకుంఠితభక్తిన్. 416

లయగ్రాహి॥ పన్నగవిభూషణ జగన్నుత గజాంతక వి
పన్నజనపాలక సరిన్నళిననేత్రా
హృన్నళినమిత్ర తొలి జన్మమున నీలిగిన
యన్నువుల మిన్నయగు నన్నగజ నిష్ఠన్
నిన్ను నెదఁ గోరి తప మున్నతి నొనర్పఁగఁ బ్ర
సన్నమయి మంచుమలమన్నియ యొసంగన్
గన్నియ వరించి సురభి న్నిఖిలభోగములఁ
జెన్నలరినట్టి దొర వెన్నఁగఁ దరంబే. 417

మహాస్రగ్ధర॥ ధరణీబింబోష్ఠి తేరై తనరఁ గనకగోత్రంబు కోదండమై ఫ
కరలీలం గ్రాలఁగా నాగమము లొగిఁ దురంగంబులై పైకొనంగా
నరవిందోద్భూతుఁ డెంతే నరదము నడుపన్ హాళి వైకుంఠుఁ డంబై
హరపుంజాపంగస్థానీయముల యసురులన్ హాపొరింగొంటివీశా. 418

స్రగ్విణి॥ దారుకాభిఖ్య కాంతారపుంజంబునన్
సారు పెంపారు వాచంయమిప్రేయసీ
వారమున్ మారదుర్వారలీలాగతిం
జేరవే శంకరా శ్రీదళాభ్యర్చితా. 419

క॥ కారుణ్యరసము పెంపున
వైరోచన రాత్రుసేంద్రి వాఁకిటఁ దగినా
వారా యసదృశకరుణా
పూరితహృదయాంతరంగ ప్రోవుము నన్నున్. 420

మానిని॥ యక్షహితుండగు నీదు పదద్వయ మాత్మ దృఢంబుగ నిల్పినయా
దక్షిణదిఙ్నుతశౌర్యుఁడు పాండ్యుఁడు త్వద్దయఁ గాంచిన పుత్త్రిని మీ
నాక్షి వరించిన సుందరమూర్తివి యాఁడ ఫణీంద్రనగం దరమా
త్ర్యక్ష జలంధరగర్వవిదారణ యాత్మజనేష్టద విష్ణుహితా. 421

క॥ అని శూద్రాద్రివిహారుని
మన మారఁగ నుతులు సేసి మనుజాధిపుఁ డిం
పెనయఁగ దేవీనిలయం
బును గని దేవి మ్రొక్కి పోయెను బసకున్. 422

గీ॥ అంతఁ దనదు పుత్త్రి వెదక నంపినట్టి
భటులు రామికిఁ జింతిల్లి పార్థివుండు
దాను దేశాటనము చేసి సూనుఁ గనెడు
వాంఛ గొని వెడలె సపరివారుఁ డగుచు. 423

గీ॥ పురుషవేషంబుతో నున్న పూవుబోణి
సాధ్వి లలితాలతయు నిలాజానితోడ
వెడలెఁ గాళిప్రసాదుని విభుని నెపుడు
గనఁగ నౌకొకో యనియెడి కాంక్ష లూర. 424

గీ॥ జహ్నుసుతమీఁదఁ బడవపై జనవిభుండు
పయనమై దారిఁ గనఁబడు పట్టణములఁ
దనయ వెదకుచుఁ జనిచని కనియె నంతఁ
గాళికాఘట్ట మనియెడు కటకవరము. 425

క॥ కని యందలితో దిగి కా
ళిని దర్శింపఁగ నిపుడు గలిగెఁ గద యని య
య్యినుఁడు గుడికిఁ జని శంఖ
స్వనుఁ గనె నతిఁకష్ట గాళిసన్నిధినుండన్. 426

క॥ జగదంబికా పదాంబుజ
యుగళ స్మరణాయత్తాత్ము యోగీంద్రమణిన్
జగతీపతి గని నమ్రత
దగ నట నిలుచుకొనియుండెఁ దనవారలతోన్. 427

క॥ అట శార్వరి నంబాపద
ఘటితాత్ముఁడైన రాజకంఠీరవుఁడు
కిరాట సుత వెదకుటకుఁ జనిన
భటులింకయు రారదేమి పాటిల్లెనొకో. 428

క॥ అని వాపోవుచు నేఁ జని
తనయను వెదకెద నటంచుఁ దగువోడమయిగా
దన యాప్తులు వెనుకొని రాఁ
జనె సుత నాయాపురములఁ జాల వెదకుచున్. 429

గీ॥ అరిగియరిగి కాళీఘట్ట మంతఁ గాంచి
కాళికేశ్వరి దర్శింపఁ గలిగె ననుచు
మోదభరితాత్ముఁడయి మేదినీశుఁ
డాత్మపరివారసహితుఁడై యచట దిగెను. 430

గీ॥ హరిహరవిలాసుఁ డేతెంచినట్టిదినమె
శార్వరీశుఁ డాపురిఁ జేరి శక్తి నెలఁగ
నేగి శంఖస్వనుని గాంచి యుద్ధశక్తి
నిలుచుకొనియుండెఁ దనవారు బలిసికొలువ. 431

క॥ తనతండ్రిని లలితాలత
గని సంతసిలుచుఁ బెనిమిటిఁ గనుమి వనరుహున్
మునికిని జడియుచుఁ గాళిని
మానస్మునఁ గొలుచుచునుండె మాళిస్మతి యచటన్. 432

గీ॥ అల్ల కాళిప్రసాదుని నరయఁ జనిన
యట్టిచారులు కాళికాఘట్టమునకు
నాటినంబున నేతెంచి యంబఁ గొలువ
నేగి విఘ్నఁగాంచి నిలిచిరి మూఁగలగుచు. 483

గీ॥ శార్వరీశుండు పంపిన చారు లంపు
నందుఁదిరిగి కాళీఘట్ట మపుడె చేరి
యంబ సేవింపఁ జని తమ యధిపుఁ గాంచి
యతని వెనుక నిల్చిరి యద్భుతాత్ములగుచు. 484

గీ॥ గడనకత్తె సేఁగి కాళిప్రసాదుఁడు
చిలుకరూపుతోడ జివ్వన నటు
పాఱి మిన్నునంటి పాటు చిలుకపిండు
గాంచి దానియందుఁ గలుసుకొనిరొ. 485

గీ॥ కాళికాఘట్టమునకు శోకంబు పాఱి
కాళిగుడియందు ఫలసుమాకలితవకుళ
భూరుహము మీఁద వ్రాలంగ భూవజుండు
గనియె వేడ్క శంఖస్వన మునిని నచట. 486

క॥ మునినటు రాజసుతుఁడు గని
జనితానందంబుమీఱ సంయమియొమగన్
జని భక్తిఁ గదలకుండెను
దనదుఃఖము దీఱుఁ దపసి దయచేసెననుగా. 487

చ॥ అతులిత నిష్ఠఁ గాళికను ధ్యానము సేసెడు మౌని యంతమే
ల్లతిఁ గనువిచ్చి యట్టెటుదగం బిలకించుచు నుండ శార్వరీ
పతియు రమాకరేశుఁడు తపస్వికి మ్రొక్కిరియొగిన్ దనోవ్యధన్
యతనికి దెల్పి మీర గతియంచును వేఁడఁగ యోగియప్పుడున్. 488

చ॥ తగుఁదగు శార్వరీశ లలితాలత యిచ్చట నిల్చియుండఁగా
వగవఁగ నేలయంచు వరవర్ణిని జూపి సతీచరిత్రముం
దగవినుపించి యామె నడత న్నుతియించి రమాకరేంద్రుతోఁ
బొగలకుమయ్య నీవిచటఁ బుత్త్రిని గనుమటంచు వాఁకొనెన్. 489

గీ॥ తనదు యోగదృష్టిని సమస్తంబు గనెడు
కాళికాంఘ్రిస్మరుఁడు పారికాంక్షివరుఁడు
దీనభావంబు గొను చిల్క తెఱఁగెఱింగి
కుంకుమము దానిపైఁ జల్లెఁ గుతుకమలర. 440

క॥ ఆకుంకుమ రజ మొదలిని
సోఁకిన యానిముసమందు శుకరూపంబున్
భూకాంతసుతుఁడు వదలి ని
జాకారము గొనియెఁ దాపసాగ్రిమమహిమన్. 441

గీ॥ ఆనిరాబారిమగఁ డంత నందఱఁ గనుఁ
గొనుచుఁ గాళిప్రసాదుఁడు వసికి వేఁట
కొఱకుఁ జనినది మొదలుగాఁ గొఱఁతలేక
యొగిని నైజకంఠధ్వని నుగ్గడించె. 442

క॥ మునినాథుఁ డంత నందఱు
దనతోఁ రాఁ గాళిసన్నిధానంబునకుం
జని లలితాలతకు నృపతి
తనయునకు వివాహమెలమిఁ దానొనరించెన్. 448

క॥ దంపతులకు నటదీవెన
లింపారఁగనొసఁగి సంయమీంద్రుఁడు చనియెన్
బెంపారెడు క్షేత్రంబుల
కంపాలి కాంగినంబ సంసేవింపన్. 444

